ఓం



# అమరనారాయణశతకము

అఖిల వేదాంతార్థ ప్రతిపాదకంబును
నిఖిల ముముక్షు జనాపేక్షితంబునునైన

కైవరపు - నారాయణకవిచే

రచింపబడి

బి. కె. నారాయణశింగ్ వారిచే

చిత్తూరు

విక్టోరియా జూబ్లి ముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడియె.

౧౯౪౯ వ సంవత్సరం.

శ్రీరస్తు.　　　　　　　　　　　　　　శుభమస్తు.

ఆత్మబోధ  పరమపదవి

# అమరనారేయణశతకము

సీసపద్యములు.

సీ॥ శ్రీరామ శ్రీరామ శ్రీరామ యనుచు నే
వేళను మదిలోను వేడుకున్న ।
గోపాల గోపాల గోపాల యనుచును
చిత్తంబు నీమీద జేర్చియున్న ।
కమలాక్ష కమలాక్ష కమలాక్ష యనుచును
చూట్కులు నీమూర్తి జూచుచున్న ।
పరమాత్మ పరమాత్మ పరమాత్మ యనుచును
పట్టుగా నిన్ను చేపట్టియున్న ।

గీ॥ తల్లి దండ్రియు దాతవు దైవమనుచు ।
నమ్మినాడను దీనుల సామ్మినీవె ॥
అమర నారేయణాచ్యుత హరి ముకుంద ।
దురితదూరక కైవరపు రవిహార ॥ (౧)

సీ॥ జయ జయ రఘురామ జయసత్యభాషణా
జయభక్తపోషణ జయతు రామ ।
జయనవగుణహార జయసుందరాకారా
జయజన మందార జయతురామ ।

జయ జయ ఫణిశాయి జయపక్షివాహన
జయరుక్మిణీనాథ జయతుకృష్ణ।

గీ॥ జయవిషకుచ పాన జయరమానాయక
జయహరనుతపాద జయనృసింహా।
పట్టువదలక నిన్నాత్మబట్టియుంటి
రక్షకుడ నీవెరక్షించు రామకృష్ణ ॥ అమర ॥ (2)

సీ॥ వసుదేవ వరసుత వైకుంఠపురవాస
నీపాద పద్మముల్ నెమ్మిదలచి।
విన్నపంబొక్కటి విన్నవించెదనయ్య
యిష్టార్థముల నిమ్మయినకులేశ।
నీనామవాక్యముల్ నిలుపుము జిహ్వాలో
వీనులు నీకీర్తి వినగజేయు।

గీ॥ మనుదినంబును భక్తినాసక్తి బుట్టించు
నీసేవపై బుద్ధినిలుపవలయు
వేరు శాయకయిక నన్ను పరమపురుష
అన్యుడనుగాన నీకునే నాశ్రితుడను ॥అమర॥ (3)

సీ॥ బాలుడై కొన్నాళ్లు బాలక్రీడలచేత
నవివేకమునసుంటి నాత్మమరచి।
మరిమీదటనుచాల మగువలకాంక్షించి
విషయములకు జిక్కివెఱ్ఱినైతి।

అటుమీాద సంసారమను మోహజలధిలో
బడి దరిచేరక భ్రమసియుంటి।

గీ॥ గురుకృపచేమిమ్ము గురిగఁటి యీవేళ
భజన జేసెదనయ్య భవవిదూర
నీదు కారుణ్య మునజేయు నీతిశాస్త్ర
శతకమర్పించితిని మారజనకనీకు ॥ అమర హరి (౪)

సీ॥ కాయంబుపై నాస కాణెత్తునిలుపడు
వరకవియగు యోగి వరుడుభువిని
అతిథులపై చాలనతిప్రేమతో నుండు
వరకవియగు యోగివరుడుభువిని
సకలజీవాత్మల సమముగా భావించు
వరకవి యగు యోగి వరుడుభువిని

గీ॥ పొట్టబట్టకు బహుగొట్టెయిన వగవడు
వరకవియగు యోగివరుడు భువిని
ఇన్నిగుణములు గలుగు కవీశ్వరుండు
భగవదనుభవ మొనరించు భక్తి నెపుడు ॥అమర॥ (౫)

సీ॥ జనులార దలచుడీ జయరామనామంబు
సకల దోషంబులు సంహరించు
శరణన్నవారల చేపట్టియేవేళ
కనురెప్పమాట్కిడా గాచియుండు



అనయంబు మురహరి నాత్మదలచినవారి
కూరిమి బ్రోచు వైకుంఠుడరసి

గీ॥ కేశవ నామ సంకీర్తన పరులైన
దాసుల వెనువెంట దానుదిరుగు
దాసవత్సలుడీరీతి దాసులందు
జేరియుండును నరులార సిద్ధమిదియు ॥అమర॥ (౬)

సీ॥ ఆనందచిత్తుడై యఖిలేశు చరితంబు
లింపుగాదానాలకింపుచుండు
మాధవ పదపద్మమంజుల స్తవములు
నోరూర నెవ్వడు నుడువుచుండు
విష్ణుమంగళ దివ్యవిగ్రహ మెప్పుడు
సేవించునతడె నిశ్చింతుడరయ

గీ॥ వాసుదేవుని శుభవైభవ మెప్పుడు
వినుతించు నతడె సద్ద్విజవరుండు
పావనులు వీరు వీరిపై పరమకృపను
రక్షణముసేయు శ్రీకృష్ణ రక్షకుండు ॥అమర॥ (౭)

సీ॥ తానను హంకార తలపుదగ్ధముజేసి
మాయ కాయము దీని మమత విడచి
దారా సుతాదుల చేరరాదని మది
నంటి యుంటక జేరియుంటదెలసి

పరధన పరదార పరనిందలకు పర
తంత్రుడై యుండు నిస్తంద్రబుద్ధి

గీ॥ జాలిబొందక సీహజాలముల్ బంధించి
శ్రీగురుధ్యానాధురీణుడైన
సజ్జనుడు చేరుసర్వేశు సముఖమునకు
పామరుల కేల కలుగును పరమపదము ॥అమర॥ (౮)

సీ॥ యెంతకాలంబైన యెరుక లేకను జీవి
చచ్చి పుట్టుచునుండు సహజమిదియు
జన్మ మరణము లెన్నొ జాతులెన్నొయనొ
తలిదండ్రులెందరో తనువులెన్నొ
యిప్పుడు ధరలోన యిటువంటి మానవ
దేహముల్ నిర్మించె దేవుడరయ

గీ॥ మునుపటి విధమున మూర్ఖులై చెడకను
శ్రీహరినామముల్ జెప్పుకొనుచు
పట్టు వదలక పరమందెదృష్టివుంచి *
భవభయంబులు లేని స పద చరింతు ॥ అమర॥ (౯)

సీ॥ శృంగారమైనట్టి బంగారు భామల
మన్నుగా జూచిన మానధనుడు *
యింద్రియంబులకెల్ల నింపైనవస్తువుల్
చంపివేసినవాడు సజ్జనుండు *

మాయలన్నిటి గురుమాతృకదగిలించి
పారదోలినవాడు పరమగురుడు *

గీ॥ చలనమందక లోని చపలమంతయుదీసి
తరిగివేసినవాడు దత్వవేత్త *
తలుపులన్నియు దిగనాడి తనువు మరచి *
తన్ను దెలిసిన వాడు దాతత్వయోగి ॥అమర॥ (౧౦)

సీ॥ తన్నుదా తెలియని తత్వయోగంబేల
హరిపూజ సేయని హస్తమేల
కమలాక్షుచూడని కనుగవలవియేల
శ్రీనాథు పొగడని జిహ్వయేల
వీనులప్రణవంబు వినని వీనులు యేల
రాగముల్ చెడని వైరాగ్యమేల

గీ॥ ఆత్మదా తెలియని ఆచారమదియేల
జగదీసు దెలియని చదువదేల
హరినిదలచక సంసృతిబరగు జనుల
యముని దూతలు విడువరుయన్నటికిని ॥అమర॥ (౧౧)

సీ। ఆరుమతములందు నఖిలాండ నాథుండు
సంప్రీతితో నుండు సహజముగను
మర్మంబు తెలియక మతభేదములు జేసి
కట్టడికర్మచే గరిగినారు

స్త్రీపురుషుల యందు శివయోగి వరులందు
జ్ఞాన హీనులయందు జ్ఞానులందు

గీ॥ సర్వసముండుండు సకలాంత రాత్ముడై
తెలియనియ్యడు మాయ తెలివి లేక
తెలియవచ్చును గురు వుపదేశమునను
తల్లిబోలినవాడు దాధరణిగురుడు ॥అమర॥ (౧౨)

సీ॥ మతములన్నియువేరె మార్గంబు నొక్కటె
వస్త్రభేదము వేరె వస్తువొకటె
శృంగారములువేరు బంగారమొక్కటి
పసులవన్నెలువేరె పాలునొకటి
జీవభాండులువేరె జీవుండు నొక్కడె
జాతి నీతులువేరె జన్మమొకటె

గీ॥ దర్శనంబులువేరు దైవంబునొక్కడే
పుష్పజాతులువేరె పూజయొకటి
తెలియలేకనుమనుజులు తెలివిదప్పి
భ్రాంతివిడువక భవరోగబద్ధులయిరి ॥ అమర ॥ (౧౩)

సీ॥ విప్రులమని చాల విఱ్ఱవీగుదు రింతె
బ్రహ్మనుజేరి తాబ్రబలలేరు
కూలీల రీతిని కులవృత్తిపోనీక
మైలకోకలు విప్పి మడుగుజేసి

స్నానసంధ్యాదులు సల్పుమాత్రమె కాని
అన్యదారా పేక్షలుడుచలేరు

గీ॥ పరులదగ్గరజేరి పలుకుదురునీతి
తమ యందు దుర్నీతి తప్పకుండ
విప్రులై తెరేల విడువరువిషయముల్
విష్ణు నెరుగ లేక భ్రష్టులైరి ॥ అమర ॥ (౧౪)

సీ॥ యేజాతివాడైన యేనీతివాడైన
హరిభక్తి గల్గువాడగ్రజుండు
పూరకుండెడివేళ నుద్యోగములవేళ
నిద్రబోయ్యేవేళ భద్రముగను
మనసు చదరనీక మదిముకుందునిమీద
భక్తి నిలిపినవాడు భాగవతుడు

గీ॥ ఆకొన్న వేళను నతితృప్తివేళను
సమబుద్ధి గలిగిన సహజయోగి
భక్తజనములు వీరికిభయము లేక
చేరియుండురు శ్రీహరిపురమునందు ॥ అమర ॥ (౧౫)

సీ॥ శివభక్తులని చాల శివపూజ జేతురు
శివుడున్న చోప్పుగాజెప్పలేరు
అల్లామహమ్మదు నాత్మలో చూడక
ముచ్చతురుక్కలకెల్ల ముక్తి లేదు

వట్టినిష్టలచేత వైష్ణవులందురు
అష్టాక్షరీగుట్టు నరయలేరు

గీ॥ కామాంధకారంబు కడుపునిండానుంచి
సన్యాసిననుకొన్న సౌమ్యుడగునె
యిన్ని విధములనుందురు యిన్నిపాట్లు
బడిన దొరకదు శ్రీహరి పాదసేవ ॥అమర॥ (౧౮)

సీ॥ తెలియకుండినమేలు తెలిశితే మరిమేలు
తెలిసి తెలియనిమూర్ఖు దెలుపరాదు
శ్రీగురుశుశ్రూష సేయనేరనివాడు
పండినచేనిలో బ్రతిమ సమము
భాగవతులజూచి భక్తిసేయనివాడు
ఆత్మయోగంబెట్లు అభ్యసించు

గీ॥ తన్ను పోషించిన తల్లినే తెలియని
వాడెట్లు గురుని భావంబు నెరుగు
దుర్జనులువీరు వీరల జేరరాదు
మూఢ భక్తిని శీఘ్రము౦బె ముక్తిగలదు ॥అమర॥ (౧౯)

సీ॥ ఇలలోన ప్రజలకు కులదైవమనివిప్రు
డాదివిష్ణుమతొల్లి ఘనతిచ్చె
ఆపరబ్రహ్మంబు నంటెనవిప్రుండు
విష్ణుడనగ తానె విశ్వమునకు

అట్టిభాగవతుడు ఆత్మశోధనగల్గి
అశపాశములన్ని గోసివేసు

గీ॥ ఆమహాత్ముని మహిమంతయు వటబీజ
మట్లు వర్ధిల్లు నత్యంత మహిమ
పూట్రగాసంబు కొరకుదా నోటుపడడు
అతడు విప్రుండు శ్రేష్టుండు ఆవనికెల్ల ॥అమర॥ (౧౭)

సీ॥ తలయెత్తిచూడడు తగుణులాకారంబు
తిన్నగామార్గంబు తిరుగుచుండు
ప్రీతితో నెవ్వరోసినయెట్లు భక్తితో
సంభావనిచ్చిన చాలదనడు
తిట్టిన గొట్టిన దీవించిననుగాని
శత్రు మిత్రులనొక్క సమముజూచు

గీ॥ రుచిపక్వములనున్న రుజువుగోరడు దను
కట్ట నట్టము వేళ కస్తిపడడు
జాలిబొందక సంసార జోలివిడచి
విడనియెట్లుండు భువిలోన విగతరుజుడు ॥అమర॥ (౧౮)

సీ॥ మితభోజనముజేసు మించనియ్యడునిద్ర
తలపు బ్రహ్మముమీద దప్పకుండు
యేవేళ పొరుగిండ్ల కేచ్చుగాదిగుగడు
యేకాంతముగ నుండు నిహామువిడచి

స్నాన సంధ్యావందనాది సత్క్రియలన్ని
ఆత్మ సరస్సులో నవగహించు

గీ॥ సతిసుతులకును దా చాలమోహించడు
పరిపాటిగాజూచు బ్రజలుమెచ్చ
బ్రాహ్మణుండన గురుడన బరగునతడు
బ్రహ్మజ్యోతినిజూచిన బ్రాహ్మణుండు ॥అమర॥ ౨౦

సీ॥ ఇహజాలములురోసి యింటివారినిబాసి
అంత్యకాలము వేళ నాత్మదెలసి
తాపరంజ్యోతిని తప్పక గురిజూచి
తనువువిసర్జించి తావువెడలి
పశ్చిమవాకిట పరుగెత్తి వేవేగ
పట్టాభిరాముని పట్టణంబు

గీ॥ జేరి శ్రీరాముల సేవించి నెలమితో
భోగంబులన్నియు బొందుచుండు
అతడె పుణ్యుండు ధన్యుండు నచలితుండు
అతడు భక్తుండు ముక్తుండు నగ్రజుండు ॥అమర॥ ౨౧

సీ॥ నిన్ను నే మదిలోన నిజముగా స్మరియింప
వాల్మీకమునుగాను వారిజాక్ష
చెలికానిరీతిని చేరిసేవించుట
కలనారదుడగాను అప్రమేయ

శయనించువేళమీ చరణమొత్తుటకును
పన్న గేంద్రుడగాను పద్మనాభ

గీ॥ భుజములనిడుకొని భువిగమించుటకును
పక్షిరాజునుగాను పరమపురుష
చాలనమ్మితి నీపాద సరసిజములు
వేరు శాయను యికనన్ను విశ్వరూప ॥అమర॥ (౨౨)

సీ॥ రావణు తమ్ముని రాజుజేసినయట్లు
అర్జునతి ప్రేమ నరసినట్లు
ఆంజనేయునిమీద నతిప్రేమవున్నట్లు
ద్రౌపదికష్టముల్ బాపినట్లు
గోపకాంతలకు నీకూర్మిజూపినయట్లు
కరిమొరవిని కృపగాచినట్లు

గీ॥ అమరేంద్ర సుతునకు ఆత్మ దెల్పినయట్లు
ప్రహ్లాదునకును ప్రాపయిన యట్లు
యట్లుప్రత్యక్షమైరమ్ము యవరుదిక్కు
భక్తజనపోషవైకుంఠ పరమపురుష ॥అమర॥ (౨౩)

సీ॥ ద్వాపరంబుననీవు ద్వారకాపురమందు
రాజాధిరాజవై రాజ్యమునకు
ప్రజలపాలింపుచు ప్రత్యక్షమైయుండి
దేవుడవనినిన్ను తెలియలేరు

కలియుగంబున నరుల్ గనుట కెంతటివారు
కమలాక్ష నీకృప గలుగకున్న

గీ॥ మనసుపక్వముగాదు మార్గంబు దెలియదు
నీపదధ్యానము నిలువనియదు
విషయకోర్కుల చేత నీవిశ్వమెల్ల
దేలుచున్నది యిదియేమొ తెలియరాదు ॥అమర॥ ౨౮

సీ॥ సకలలోకాధీశ సజ్జనమందార
తారకాచలవాస వారిజాక్ష
మూలమంత్రాధార మునిజనపరిపాల
సురమునిస్తోత్ర భాసురచరిత్ర
కందర్పజనకనీ పొందుగానక యెంతో
భాగవతులు మోహాబద్ధులైరి

గీ॥ నేనెంతవాడను నిజముగా దెలియను
నిందుచూపులుజూడు నిర్మలాత్మ
రాత్రి పగలును శ్రీరామ రామయనుచు
భజన జేసెద భవముల బాపజూడు ॥అమర॥ (౨౯)

సీ॥ పూర్వజన్మమునాడు పుణ్యపాపంబులు
యెన్ని జేసితోనేను యెరుగయిపుడు
యిలలోనజన్మించితికమీద యెన్నెన్నో
అపచార హేతువులంటినానో



పూర్వదురితములు పునరా_క్తదురితము
లంటకుండగవాటి నణచకున్న

గీ॥ వంచనగల్గు దా మెంచరు యమభటుల్
నీ నామ మంత్రంబు నిశ్చయంబు
కీర్తిబోనాడి అపకీర్తికిరువుగాక
అభయ మొసగుము శ్రీ వేంకటాద్రినాథ ॥అమర॥ ౨౬

సీ॥ తండ్రి శ్రీరాములు తల్లి సీతాదేవి
యని నమ్మినాడ నేననుదినంబు
నే శేయుపాపముల్ నాశమొందును నిక
మీసంస్మరణచేత మించుకతన
తల్లిదండ్రులు మీరు తనయుని తప్పులు
మన్నించి కాచిన మాటవాసి

గీ॥ పరమాత్మనినునమ్మ బట్టి వకాకెత్తు
పంచేంద్రియములకు బట్టుబడను
నిద్రకలనైన మిముధల్తు నిజముగాను
రవికులాంబుధిచంద్ర శ్రీరామచంద్ర ॥అమర॥ (౨౭)

సీ॥ తడవుచేయకు వేర తనయుడారమ్మని
పట్టితాతొడలపై బెట్టుకొనుచు
ఆరగించరపాలు ఆకలిగొన్నావు
కన్నతండ్రికి నన్నుగన్గొనుమన

మాతను వీక్షించి మస్తకమును వంచి
పాదముల్ చక్కగాబారజూచి

గీ॥ జిహ్వాక్కళింపుచు జిహ్వాలోతల్లికి
విశ్వము జూపిన విధమునాకు
జూపరాదేవ నీవిశ్వరూప మిపుడు
తాళజాలను నీమీద తలపుమరువ ॥అమర॥ (౨౮)

సీ॥ నరబొమ్మలనుజేసి నడుమ కూచమువేసి
యేడ కనంబుల నెత్తిపట్టి
కీళ్లారుపదులుగా గీలించిదానిపై
తొలగకుండగ మంచి తోలుగప్పి
వరుసగాదానిలో వాసముల్ దగిలించి
బిగువుగా నరముల బిగియజేసి

గీ॥ మాంసము నెత్తురు మజ్జయుతోగూడ
అంగాంగములకెల్ల నదరుపరచి
ప్రాణవాయువు బొందించి ప్రబలముగను
నిలిపి నాటకమాడించు నేర్పరివిగ ॥అమర॥ (౨౯)

సీ॥ కవినాయకులకెల్ల కల్పవృక్షంబైన
బమ్మెరపోతయ భక్తవరుని
విమలహృదబ్జ నివేశుడవై నిత్య
భవహారంబైన శ్రీభాగవతము।



సరణి వాక్కులకిచ్చి చాల సత్కృపనుంచి॥
ద్వాదశస్కంధముల్ తథ్యముగను।

గీ॥ పలికించినట్లు నాపలుకు నీస్మరణమే॥
పలుకగా జేయుము పావనాత్మ।
వసుధపరిపాల మురహార వాసుదేవ।
కృష్ణవామన శ్రీపతి సింధుశయన। ॥అమర॥ (౩౦)

సీ॥ వేదాంతవేద్య శ్రీవేణుగాన వినోద॥
కరుణాపయోనిధి కంసహారణ।
గరుడ తురంగ శంగర భీమబలభద్ర॥
మారసహస్ర సమాన తేజ।
నరసఖగోవింద నలినాక్ష మాధవ॥
మాగధఖండన మధురవచన।

గీ॥ సరశిజోదరనిత్య సత్య సంభాషణ॥
దేవకీనందన దేవదేవ।
నిలచియుండుము నాయాత్మ నిత్యముగను।
ఆలకించర నామాట నాదిదేవ ॥అమర॥ (౩౧)

సీ॥ సరసిజాననలతో సరసంబులాడను॥
మదిదలంపుచు నన్ను మరచినావో।
భామామణుల మానభంగంబు చేయను॥
మదిదలంపుచునన్ను మరచినావో।

గొల్లయిండ్లలో పాలుచల్లారగించను॥
మదిదలంపుచునన్ను మరచినావొ।

గీ॥ పదియూరువేల గోపస్త్రీలతో గూడ॥
మదిదలంపుచు నన్ను మరచినావొ।
చింతలేకను గొలువ నత్యంత భక్తి।
పంతమేటిక నామది చింతదీర్పు ॥అమర॥ (3౨)

సీ॥ యేకాంతముననాకు నెరిగించితివి మహా॥
మంత్రోప దేశంబు మరువ నయ్య।
మంత్రాయుధము నాకు మదిలోన జేరి యీ॥
మాయనికారముల్ మట్టుపరచె।
కపటసంసారాంధ కారాగృహములోని॥
చింతలు విడిపించి శీఘ్రముగను

గీ॥ జన్మమరణ ముఖ్య జాడ్యము లికమీద
దొరగతినేను సంతోషినైతి
స్వచ్ఛమైనట్టి మీనామజపముచేత
నిర్మలంబాయె జన్మంబు నీదుకృపను ॥అమర॥ (33)

సీ॥ భామ సంగమువేళ భక్షించువేళను
బాటను చనువేళ బండువేళ
వూరకుండెడివేళ నుల్లాసపడువేళ
భాగవతులతోటి బల్కువేళ



కలిమి లేముల వేళ కష్టపడే వేళ
నిందెలుబొంది దానిల్చు వేళ

గీ॥ సుఖదుఃఖముల వేళ శూరుడౌ వేళను
సుందరాంగనలను జూచు వేళ
చలనమొందదు మనసున చక్రహస్త
నీవు బెట్టిన మందేమొనిన్ను దలతు ॥అమర॥ (38)

సీ॥ నీ పేరిటను శిలల్ నిర్మించి ధరలోన
పూజలు సేయించు పుణ్యులకును
నీ నామ కీర్తనల్ నిర్మలమదితోడ
పఠనగల్గినవారి పాటిగారు
పగనైన వగనైన ప్రాణభీతినినైన
ఆత్మలో దలచుట అధికబుద్ధి

గీ॥ ధనధాన్య పశుభృత్య దారాదివస్తువుల్
నీకర్పితము జేతు నిత్యముగను
శరణుశరణయ్య శ్రితభయహరణనీకు
నాత్మ ధ్యానింతు నీకీర్తి ననుదినంబు ॥అమర॥ (39)

సీ॥ శ్రీమానినీవర శృంగార రూపక
రఘుకులతిలక శ్రీరామభద్ర
మాణిక్య మణిహార మరకతమణి దేహ
కనకరత్న కిరీటకమలనాభ



భవభంగ నీలాను పంకజలోచన
పతితపావన రామభవ్యనామ

గీ॥ శంకర ప్రియవహ్నా చంద్రభాస్కరనేత్ర
కపటనాటకసూత్ర కమల నేత్ర
విబుధ జనపోష నీవు నాకభయమిచ్చి
కరుణ జూడర దాసుని గన్నతండ్రి ॥అమర॥ (31)

సీ॥ వ్రతనేమములు జేసి వెతలు జెందుటెగాని
అందువల్లను యేమి ఆశలేదు
మాతృ పితాచార మమతలింతేకాని
దెలియుదించుకయైన దీనిలోన
మడుగునీళ్ళను ముణ్ణిమడుగాయనందురు
కామాంధ కారంబు కరిగిపోదు

గీ॥ ఇంటిదైవంబును యిలలోన దైవంబు
వేరుగా జూతురు వెఱ్ఱిమతులు
ఇన్ని అగచాట్లుపడనేల నన్నివిడచి
యోగదృష్టినిహరిజూడ నాగతంబు ॥అమర॥ (32)

సీ॥ తామసం బణచించి తలపుతట్టకపొంచి
లోచూపుగురిజూచి లోతుదెలిసి
పాతాళగుహజొచ్చి ఫణిపైకి లఘించి
అసహాయ శూరుడై యచటనున్న

ఆర్గురు రాజుల నాశ్రయంబులు చూచి
మందర చనుబాట మూలమెరిగి

గీ॥ మూడేకమైయున్న ముక్తిద్వారము దూరి
పండువెన్నెలపట్న మందుజేరి
రామరాజును బొడగన్న రాజయోగి
పునరాజన్మాదులెత్తని పుణ్యుడతడు ॥అమర॥ (౩౮)

సీ॥ ఘటశోధకుండైన ఘనయోగిచర్యలు
యెరుగవశమె యెంత వారికైన
యోగమత్తతచేత యోచించ డేమియు
తారకంబునబుద్ధి దగిలియుండు
దుష్టుల చేరడు దూషించ డెవరిని
మర్మమియ్యకను దామాటలాడు

గీ॥ యిరుగు పొరుగు వారి యింటిలో వారిని
సమచిత్తమున జూచు సత్యమిదియు
మాయకాలము దీనిని మంటికొసగి
మింటనున్నవాని వెంటజనును ॥అమర॥ (౩౯)

సీ॥ ఆత్మను శోధించి అనలంబు జల్లార్చి
అష్టకుంజరముల నణచిపట్టి
మూడీషణములను మోహంబు తెగవేసి
మరుశరంబుల మటుమాయజేసి

తత్వనీతిని దేవధామంబు గనుగొని
    తత్వగుణంబుల తావులెరిగి

గీ॥ భక్తియోగముచేత బ్రహ్మంబు దెలసిబా
బ్రహ్మలోకముచేరు భాగవతులు
అతని వర్ణింప శక్యమా అజునికైన
ఆ ఘనుని నామమానందయోగియంద్రు ॥అ॥ (౮౦)

సీ॥ జలమున ననలంబు సాధింపగావచ్చు
    ననలమునర చేత నంటవచ్చు
కారుపాషాణముల్ నీరుశాయగవచ్చు
    పులిమీసములు చేత బూనవచ్చు
పన్నగరాజునుబట్టి చుట్టగవచ్చు
    నుక్కు తీగెలమీద నురకవచ్చు

గీ॥ రెండు సైన్యంబులు బండనంబొనరింప
వారిద్దరితో దానుబోరవచ్చు
గాని యోగంబు సాధింపగానరాదు
లక్షకొకడుండు నేమొవిలక్షణుండు ॥అమర॥ (౮౧)

సీ॥ మనసొక్కగడియ నీమహిమెడబాయక
    దలచిననదియు వెన్నలఘటించు
మరిరెండు ఘడియల మలినమెంతయుబాసి
    స్రష్టి చంద్రునిగతి చెలగుచుండు



మూడుఘడియలకు మూర్తి కళకుతాను
పాతిక తక్కువై ప్రబలుచుండు

గీ॥ నాల్గు ఘడియలలోను నక్షత్రములు బుట్టు
పూర్ణచంద్రునికళ బోల్పుమీరు
అట్టి చంద్రుని కళలోన హరిగురుండు
వెలుగుచుండును పగులొత్తి విధముగాను ॥అమర॥ (౪౨)

సీ॥ తనువులోనున్నట్టి దైవముంగానక
మూఢుడనై నేనుమోసపోతి
చిత్తంబునీమీద జేర్చనేరక సదా
స్త్రీమోహమునచాల చిక్కుపడితి
వీనులవిందుగా వినక నీచెరితముల్
యింద్రియములకు నేనీడుపడితి

గీ॥ ననుదినంబును జిహ్వా హరిహరియనుమాట
బలుకనేరకచాల భ్రమశియుంటి
*తెలుసుకొన్నాడయిప్పుడు తేటపడెను
మాయసంసారమునన్నున్న మర్మమెల్ల ॥అమర॥ (౪౩)

సీ॥ అవనిజాపతిరామ అంబరీషస్తుతా
భక్తమందార శ్రీభానువంశ్య
మదిలోన సంసార మాయనుబరిమార్చు
దీనాత్ములకునెల్ల దిక్కునీవె

యందు నీవుందుబో యేరూపువాడవో
యని వెదుకుదుమదినసుదినంబు

గీ॥ నీకటాక్షముచేత నిలచినీపై బుద్ధి
నీశుభచెరితముల్ నెమ్మిదలతు
మదినిసంశయచలనంబు మానవయ్య
అలమటించకుయిక నన్నునవనినాథ ॥అమర॥ (౪౪)

సీ॥ తల్లిదండ్రిగురుండు దాతదైవము మిత్ర
బంధు వర్గమునీవెభవ్యచెరిత
యెపుడెపుడనుచును యెదురుచూచెడినాకు
జూపరా నీమూర్తి సుందరాంగ
పరమాత్మనీపద్మముల్ నెరనమ్మి
మీనామభజనలో నిలచినాడ

గీ॥ కరుణారసముజూపి కంజాతలోచన.
నయనోత్సవంబుగా నడచిరమ్మ
వంచనేమైన దలచకుంకంచివరద
నిన్ను నమ్మినవాడన నిగమవేద్య ॥అమర॥ (౪౫)

సీ॥ యింతనాలస్యమా యిది నీకుమంతమా
యెంతని వేడుదు కంతుజనక
మందమోపక నానందమోయడగాక
దూరదేశంబున కరిగినావొ

యిందిరాదేవిని నిదురానివ్వదో
మహీ పాలనము శాయ మరచినావొ

గీ॥ తిరుపెమెత్తుటకునై తిరుమలపై జేరి
కాశు లార్జననిన్ను కదలనీదో
యిదియుగాకున్న వేరొక్క యింతిగూడి
నన్ను మరచితివేమొ శ్రీనారసింహా ॥అమర॥ (౪౮)

సీ॥ ఆ కుచేలునిచేత నటుకులుభక్షించి
యెచ్చయిన సంపదలిచ్చినావు
రాతిరూపంబైనా గౌతమభార్యను
పదధూళిచే బాగుపరచినావు
నీరధి జొచ్చిన నిజగురుసుతువున
జ్జీవితుగా కృపజేసినావు

గీ॥ వేదచోరకువిదళించి వేదముల్
తెచ్చి బ్రహ్మకు నేగనిచ్చినావు
అన్నిదబ్బర నన్ను బ్రోనకున్న నేడు
దేవనామీద సత్కృపదృష్టి జూడు ॥అమర॥ (౪౭)

సీ॥ తలపునీమీదను తప్పదు శ్రీకృష్ణ
మున్ను నే జేసినపుణ్యమేమొ
దేహంబువేరుగా దెలసినీకృపవల్ల
దేహాభిమానంబు దీరెనేమొ

రామనామామృత రసము పానముజేసి
మది నితరంబులు మరచెనేమొ

గీ॥ యింతులపై మోహచింత లేశము లేక
నీమీద నిజభక్తినిలచెనేమొ
నిన్ను నమ్మిన నీదాసనికరమునకు
నీవెదిక్కని దలతురునిపుణ మతులు ॥అమర॥ ౪౮

సీ॥ అఖిలాండకోటి బ్రహ్మాండనాయక శౌరి
దైవలలామ కోదండరామ
మాధవగోవింద మధువైరి సర్వేశ
అచ్చ్యుతవామన అప్రమేయ
జలజలోచన జగజ్జనక జనార్ధన
చంద్రశేకరనుత చక్రపాణి

గీ॥ పరమపావననామ పరమాత్మ శ్రీహరి
పంకజలోచన పద్మనాభ
వినుతనిజదాస నికరశ్రీవేంకటేశ
తడవుశాయకరక్షింపు తర్లిరమ్మ ॥అమర॥ (౪౯)

సీ॥ ఇభరాజరక్షక యిమ్మహిప్రాణుల
నెవ్వాడు నిర్మించె నెవడుకర్త
ముగ్గురుమూర్తులు నీవె ముల్లోకములునీవె
జలధులు భూతపంచకమునీవె



వరుణుండు వాయువు వహ్నియు శశిరవి
దేవముఖ్యుల కెల్ల దిక్కునీవె

గీ॥ పగలు రాత్రియు నీవె ఫాలాక్షుడునునీవె
పరమేష్ఠియునునీవె పరమపురుష
నిండియున్నది జగమెల్ల నీదుమహిమ
యెందుజూచిన నందెల్లనుందునయ్య ॥అమర॥ (౨౦)

సీ॥ సర్వసంగత్యాగ సంపూర్ణ పరతత్వ
యోగకాముండైన యోగివరుడు
పసిడిజూచిన దాను భ్రాంతియుజెందడు
సమబుద్ధిగనుజూచు సహజముగను
సంసారజంజరి సంతతినెప్పుడు
సంతకూటము ప్రజసమము జూచు

గీ॥ యెప్పుడేవేళనో యేపూటయేచోట
తనువువిసర్జింప దలచియుండు
మనసుదెగినగాని మానవురోగముల్
మనసు దెగకయుండ మాయవిడదు ॥అమర॥ (౨౧)

సీ॥ ఆత్మదెలియనీను అజ్ఞాన చిత్తంబు
సుజ్ఞానజ్యోతినిచూచుటెట్లు
ఆత్మమండల మెల్లనంటియున్నదిమాయ
మంచుకప్పినయట్లు మానవులకు

శ్రీహరినీసేవ జెందువిధంబెట్లు
నీపదధ్యానమునిలచునెట్లు

గీ॥ మాయ తెలియగ లేక మాయకులోనైరి
మాయదెలసువాడు మానవుండు
ఆత్మధ్యానించు హరియను అక్షరములు
పట్టి బంధించవలె మనఃపద్మమందు ॥అమర॥ (౨౨)

సీ॥ పచ్చికసువు మీద పశుజాతికిని యాస
మార్జాలములకునుమాంశమాస
కలువతూడులమీదకలహంసములకాశ
పక్షిజాతులకును ఫలములాశ
అడవిమృగములకెల్ల నంధకారంబాశ
జలజంతువులకెల్ల జలములాశ

సీ॥ మంచిపుష్పసురిశ మధుపసంతతికాశ
పురదేవతలకెల్ల పూజలాశ
అల్పనరులకాశ లన్నింటియందుండు
ఆశదుఃఖములకు నాలయంబు ॥అమర॥ (౨౩)

సీ॥ ముక్తికిగురుకీలు మూడక్షరంబులు
మూలముదెలసిన ముక్తుడగును
ఆమూర్తి నెవ్వడధ్యానంబుజేసిన
నతిసులభంబుగనాత్మగనును

ఆత్మగన్నంతనె ఐక్యసంధానుడై
ఆకాశపురిజేరి యచటనున్న

గీ॥ దివ్యజ్యోతినిజూచి ధీరుడై యచ్చోట
బుద్ధిబాయక హరిపూజయందు
నిలచిధ్యానించు హరిపదనీరజములు
విశ్వగుణముల నెరుగకవిమలబుద్ధి ॥అమర॥ (౨౮)

సీ॥ ఖరఖరవంస్యరాఘవ వినిర్జితభృగు
రామ శ్రీదశరథరాజతనయ
సనకసనందాది సన్మునిపాలక
ద్విజపరిపాలవందితకుచేల
హోన్న మోనరహరి ఓవిరళేశ్వర
ఓపురుషోత్తమ ఓమహాత్మ

గీ॥ శివధనుఃఖండన శ్రీరంగపురవాస
పలుకరపరమపావనశుభాంగ
మానముననున్న దేమినీమర్మమిపుడు
నేరమెంచకునినునేను నమ్మినాడ ॥అమర॥ (౨౯)

సీ॥ చాటిచెప్పెదహరి సన్నధికినిజను
జాడలువినరయ్య సమ్మతముగ
కుటిలబుద్ధులుమాని కులగోత్రములువీడి
సకలజీవులనొక్క సమయముజూచి

తాఁజేయుపనులన్ని దప్పక శ్రీహరి
కర్పించవలెభక్తి నేర్పుమీర

గీ॥ సంసారముననున్న సారమంతయుఁ బేర్చి
అంబుజాక్షునకర్పితంబుజేసి
భ్రమలుజెందక సంసృతిపాలుగాక
భవ్యవిజ్ఞానమునుదను బడయవలయు ॥అమర॥ (౨౭)

సీ॥ మండలగోష్టిచే మణిగెలోకంబెల్ల
పదిటనొకడుండు పండితుండు
నీతిశాస్త్రవిచార నిపుణులు లేరైతి
ప్రతివాదజనములు ప్రబలమైరి
అవనిలో ప్రజలంత సంతకు పాలైరి
పకపాలువైకుంఠవాసులైరి

గీ॥ శ్రీహరిచరితముల్ జెవిసోకవెవరికి
పలువప్రసంగముల్ ప్రబలమాయ
యేది సద్గతివీరికి నేదిత్రోవ
యన్నివిధములనైనను యముడెదిక్కు ॥అమర॥ (౨౮)

సీ॥ నంబివానికిభువి నరకంబుసిద్ధంబు
భక్తిగల్గినవాడు బడయుముక్తి
భాగవతునిభార్య బహుజారవతియైతె
యేడుజన్మంబుల బోడియగును



మతదూషణముజేయు మానవుడెవడైన
పాపముల్ వెన్నంటబారుచుండు

గీ॥ సహజయోగీంద్రుడు శాపమిచ్చినమీద
హరిహరబ్రహ్మాదులషయమీరు
వరకవీంద్రునివాక్యము పవిత్రశరము
నెరిగివాడకగానిదావెరవుగాదు ॥అమర॥ (౫౮)

సీ॥ కలిదోషకలితమై కలిగె నీదేహంబు
కలినశించుటకును కాలమెంతో
దల్లిగర్భము నందుదగిలితొమ్మిదినెలల్
మలమూత్రములలోన మగ్గుచుండి
పుట్టిగిట్టినమస్తభూమెల్లసరిపోయె
లేనిచోటలేదులేశమైన

గీ॥ మున్నుజన్మములెన్నొ ముదిత లెందరో యిక
మీదజన్మములెన్నొ మితము లేదు
చాలుకష్టము లికనాకుజాలు
నీపదధ్యానమును మదినిలుపవయ్య ॥అమర॥ (౫౯)

సీ॥ రామనీ పాదపరాగ ప్రభావంబు
లోకమాతకునహల్యకునుదెలుసు
నిజముగానీహస్త భుజమహిమంతయు
శంఖచక్రాదిశస్త్రము లెరుంగు



మాధవరామనీను స్తకమహిమయు
    హీరమాణిక్య కోటీరమెరుగు

గీ॥ పట్టాభిరామనీబలపరాక్రమమును
కలుషాత్ముడగుదశకంఠుడెరుగు
సర్వసాక్షిరూప సకలాంగములమహి
మెరుగుబోలు పన్నగేంద్రునకును ॥అమర॥ (౬౦)

సీ॥ ఇతరముమాని నేనతిభక్తితోనుంటి
    కమలాక్ష నామాటకల్లగాదు
తలపునీమీదను దప్పకున్నదిసుమీ
    కమలాక్ష నామాటకల్లగాదు
నిమిషమాత్రంబైన నిన్నెడబాయను
    కమలాక్షనామాటకల్లగాదు

గీ॥ తనువికారములన్ని దనుదానువీడెను
కమలాక్ష నామాటకల్లగాదు
నీకుదెలునును భక్తులనిజగుణంబు
కపటమానసులెరుగ రీకలియుగమున ॥అమర॥ (౬౧)

సీ॥ శ్రీరామనీవంటి శిష్టునకవియేల
    మానవాకారంబు మచ్చరంబు
అవనిలోదనుజున కభయమిచ్చినదాని
    చెల్లించవలెనంచుజేరిలంక

ఆదికాలమునాటి యనుభవంబనకను
చిత్తంబులోఁజింత జేసినీవు

గీ॥ క్రౌర్యుడైనట్టియారావణుబరిమార్చి
జయమును చేకొన్న జగతినాథ
కలుషసంహార సత్కటాక్షమునజూచి
నాదుదురితంబు లెంచకనన్ను బ్రోవు ॥అమర॥ (౭౨)

సీ॥ గురువులకెల్లను గురుడవౌనాస్వామి
నీ కేల గురుబోధ నీవెగురువు
గురుశిష్యన్యాయంబు గురు తెరింగిన లోన
నీవె బ్రహ్మంబని నీకెదెలసె
మనుజాధముడనన్ను మన్నించిజిహ్వలో
నీనామమంత్రంబు నిలుపవయ్య

గీ॥ నీపదపద్యముల్ నిర్ణయించినమీద
యంచడుమతభేద మించుకైన
నాత్మలోననునీమహిమానతిచ్చి
శతకమీడేర్చు మీహారి జలధిశయన ॥అమర॥ (౭౩)

సీ॥ అంత్యకాలముదాను నరయజాలని వారి
గురువులుగా వారిగోరరాదు
దన్ను దాదెలియకతత్వంబు దెలియదు
అట్టివానిని గురువనగరాదు

ఆశలుజెడిపోవు హరిచింత లేశము
నిమిషమాత్రంబైన నిలుపలేడు

గీ॥ కుజనులతో పొందుగోరుచు
సుజనులజేరగమదినిరసింపుచుండు
హీనజాతి గురుడు హీనశిష్యులమెచ్చు
దోషకారి కేల దొరకుగురుడు ॥అమర॥ (౬౪)

సీ॥ అమ్మమ్మహరిగురుండవనిలో ప్రజలకెల్ల
జాతిభేదములేక జరిపినాడు
శూద్రుడై జన్మించి సూత్రదారము వేశి
నడుమను మార్గముల్ నాలుగాయె
భాగవతులతోటి పరుషంబులాడక
శూద్రుడు వీడని జూడకెపుడు

గీ॥ అన్నిటహరి యుండునని మదిదెలియక
నార్గురు గురువుల నాత్మమరచి
తమ్మునమ్మినవారను దాముగూడి
పోవుచుందురు దుర్గతి పొందుగోరి ॥అమర॥ (౬౫)

సీ॥ చూపులుసుళువైతె జూపున గురిజేసి
జూపునసద్గురు జూపజూచి
ఆత్మకొలనుజేసి యానందచిత్తుడై
ఆజలమాతృణమందెదెచ్చి

గురునిపాదంబుల శిరమునసభిషేక
మెలమితోఁగావింపవలయుబుద్ధి

గీ॥ మానసంబునమంచి మల్లెలు మొల్లలు
జేర్చి దండలుగాఁగూర్చిమంచి
గంధకస్తూరి ఘనశార కలితరజము
జేర్చిభక్తిని గురుని పూజింపవలయు ॥అమర॥ (౭౭)

సీ॥ పరదేశికునిచేత పరమపావనమగు
భాతిచేచలగు సాకేతపురము
విమలవిశాలమై విలసిల్లుగోపుర
కేతురంజితముసాకేతపురము
ప్రణవమెప్పుడు చాల బల్కుచునుండెడి
కీరశోభితము సాకేతపురము

గీ॥ పండువెన్నెలవలె ప్రబలుచు సతతంబు
వీత భయంబు సాకేతపురము
కీర్తిసంపదకిరువు సాకేతపురము
కేశవునిచేత ప్రబలుసాకేతపురము ॥అమర॥ (౭౮)

సీ॥ సతులమీఁదనుజూపు సాగనియ్యనివాడు
పురుష రత్నంబన భూమిప్రబలు
మహిమసర్వం విష్ణుమయము జగత్తని
బల్కునాతఁడు మహాభాగవతుడు

సంశయింపక సర్వజనులిండ్ల భక్షించు
నవధూతయగువాని కంటులేదు

గీ॥ మట్టిలో నను పిత్తునాటిన చందము
తనువనుమంటిలో తగిలియుండు
మన్ను మన్నైను జీవుండుమాయమౌను
వెదకిజూచిన నెవగును వెంటరారు ॥అమర॥ (౬౬)

సీ॥ యోగీశ్వరుడు భక్తియోగంబులేకను
యోగిగాడతడు దుర్యోగియౌను
హరి నామకీర్తనలనుదినంబును భక్తి
కీర్తించు నతడు యోగీశ్వరుండు
దమకును జావుసిద్ధంబని దెలసియు
మోహాబ్ధిలోపల మునిగిచెడిరి

గీ॥ దేహసంబంధముల్ దిగనాడగా లేక
కష్టాత్ములై ముక్తిగాంచరైరి
యిట్టిజనములగతియే మొఘట్టిగాను
దేవ శ్రీకృష్ణనీవాసతియ్యవయ్య ॥అమర॥ (౬౭)

సీ॥ హరిహర బ్రహ్మాదులాత్మలో నుండగ
దేశ దేశంబుల దిరుగనేల
నతిసుందరంబైన నాత్మకాంతను మాని
అన్యకాంతలమీద నాశలేల

భావశుద్ధిజ్ఞానభక్తి గల్గినమీద
దారిద్ర్యదుఃఖముల్ దలచనేల

గీ॥ యేకాంతపురిబాట నెరిగినవాడైతె
వేదశాస్త్రంబుల వెదుకనేల
తత్త్వముడిగిన వెనుకను తంత్రమేల
భేదముడిగిన వెనుకను వాదమేల ॥అమర॥ (20)

సీ॥ చచ్చిపుట్టిన విద్య శాధకంబెరిగిన
చింతనొందరుయోగ చిత్తులవని
తెరుపుమరుపును లేని తెలివితేటయుగల్గి
తామసచేష్టల తలపులుడిగి
నిర్మలానదుడై తిత్యపూర్ణ సమాధి
నిద్రలోనను యోగనిద్రదెలసి

గీ॥ లోకములన్నియు యేకమైవెలిగెడి
దీపసన్నిధిగని దేజరిల్లు
పుట్టుపోకలు లేకను బొందుహారిని
వేషభావలుచేత వివేకి యగును ॥అమర॥ (21)

సీ॥ పగలురేయువెలుంగః ప్రబలమైభాను చం
ద్రులుగారు నక్షత్రములునుగావు
పాదపదములు లేవు పక్షిజాతులుగావు
పగలురేత్రియులేదు బారజూడ

వసుధజలముగాదు వరషధారలుగావు
ఆత్మజంబుపై నూట సలిలముండు

గీ॥ చర్మవాద్యముగాదు శంభుజాగటిగాదు
స్థిరముతో ధరణి భేదింపవలయు
యిలనుజనులకు నీభావమెరుగరాదు
బ్రహ్మముఖ దేవనుతుడు శ్రీరాముడెరుగు ॥అ॥ (౨౨)

సీ॥ అంతరంగపుదృష్టి నంటియాత్మజ్యోతి
భోగమెరుంగత యోగిగాడు
పరసుందరులమాత్ర భావనచేత వి
వేకింపకను తత్వవేత్తగాడు
అనుదినంబును హరినాత్మలోభక్తితో
దలచువారికి సముల్ ధాత్రిలేరు

గీ॥ కరిరాజవరదుని చెరితముల్ పఠియించు
వారికినెవగారు వరకవీంద్రు
లాత్మలింగంబు చూడనియల్పవిద్య
విడలేయమగెల్చువిద్యలే యెరుగవలయు ॥అ॥ (23)

సీ॥ కరగకరగగవచ్చు కనకంబునకు వన్నె
తరచతరచగవచ్చు దధికివెన్న
చూడచూడగనాత్మజ్యోతి దాజొప్పుడు
వినగవినగముక్తి విధముగనును

నడువనడువగట్టనడిమి బాటనుజేరు
ననగననగ మాటలమృతమౌను

గీ॥ కాయకాయగబూజ చక్కగావచ్చును
తినగతినగను జేదుతియ్యనౌను
నితరములులేకనీయోగ తత్త్వమెరిగి
మోహశోకమువిడచిన ముక్తుడగును ॥అమర॥ (౨౮)

సీ॥ బట్టబయిటనునుండు బ్రహ్మాండమనుపురి
కోట కొమ్మలుమూట కుదిరియుండు
పరమాత్ముడనురాజు పాలించుపురమున
లలితవైభవముల చెలగుచుండు
కడుభీకరంబైన కరణముల్ నలుగురు
కాచియుందురునదా కదలకుండ

గీ॥ పరులనుజొరనీక పన్నుగుండొక్కడు
పూర్వద్వారమునను పొంచియుండు
దొరక నేరరుదీనికి దొడ్డులేదు
కర్మములబాపు యీ యోగకర్మసరణి ॥అమర॥ (౨౯)

సీ॥ జననిజనకులు లేక జన్మించెనొక్కడు
చిచ్చులేకను నంటుజేయునొకడు
మాయవిద్యలుగల మాయకాడొక్కడు
పుట్టుచావునులేని పురుషుడొకడు

ఘటములు నిర్మించె ఘనుడు వాడొక్కడు
వసుధను పాలించు వాడునొకడు

గీ॥ రథముపైనుండు సారథులు ముగ్గురు బహు
లీలతో బండ్లులేని రథము
పరుగుబారుచు దానిపై బరిణమించు
దిరుగుచున్నట్టివారిని దెలియవలయు ॥అమర॥ (౭౬)

సీ॥ మీదేహముననుండు నెల్లలోకంబులు
నీదేహముననుండు నీశ్వరుండు
నీదేహముననుండు నిష్టార్థసిద్ధియు
నీదేహముననుండు నాదిగురుడు
నీదేహమున నసియింతురు దిక్పతు
లొందరు చంద్రార్కులీతనువున

గీ॥ నీ దేహముననుదా మిరువుదేసుకపంచ
భూతముల్ నివసించి బొల్పుమీరు
అట్టిబ్రహ్మాండ పట్టణమాశ్రయించి
పట్టిజూచినగుట్టెల్లబయలుపడును ॥అమర॥ (౭౭)

సీ॥ మనసులోబుట్టును మాయవికారముల్
మనసులోబుట్టును మచ్చరములు
మనసులోబుట్టును మగువలపైప్రేమ
మనసులోబుట్టును మదము చాల



మనసులోఁ బుట్టును మానసరోగముల్
మనసులో ధనధాన్య మమతదగులు
గీ॥ మనసులోఁ బుట్టును మానాభిమానముల్
మనసులోఁ బుట్టు సన్మానకాంక్ష
మనసులోన భ్రమలు మనసునఁ బండించి
మనసుగెలుచువాఁడు మాన్యతముఁడు ॥అమర॥ (౭౮)

సీ॥ బ్రతుకుకోసరముగా పగలెల్ల దిరుగుచు
నిశయైనమీఁదను నిద్రఁజెంది
తెరుపుమరుపులచేత తెల్లవారెడుదాక
నఖిల స్వప్నంబుల ననుభవించి
అటమీఁదలేచి దానజ్ఞానచితుఁడై
ద్రవ్యము నార్జింపఁదగిలబుద్ధి
గీ॥ మాపురేపనుని టి మనుష్యప్రత్తికనిచాల
దనితనలోనను తల్లడించు
దనతరముగాని కోరికల్ దలఁచిచెడును
మాయ తెలియక జెడుదురీ మనుజులిట్లు ॥అ॥ (౭౯)

సీ॥ పుట్టించుదైవంబు పోషింపనేరఁడా
వ్యథలజెందుట శుద్ధ వెఱ్ఱితనము
దనపూర్వకర్మముల్ దప్పకవచ్చవెంట
దగిలిరాకను వేల దప్పఁజూచు
రామనామామృత రసముఁ గ్రోలెడివారి
జేరదెన్నటికిని దురితసమితి

గీ॥ దైవమానమ్మితి తరిజేర్చుమని దన
శరణుజొచ్చినగాచు జక్రధరుడు
నరహరిని చాలమదిలోన నమ్మియున్న
భాగవతులకు భవబంధభయము లేదు ॥అమర॥ (౮౦)

సీ॥ చీకటితనవులో జిక్కిన జీవుడా
వెదుకగనీకేల వెలుగు లేదు
అంధకురీతిని నగచాట్లబడనేల
యరుకను దీపంబు మెరుంబొంది
భ్రమలన్నిదిగనాడి బాట చక్కగజూచి
నొంటి కంబపుమేడ నొయ్యజూచి

గీ॥ వాయుజుడేరీతి వార్థదాటెను నట్లు
కుప్పించి మేడపై కొనగజేరి
చూడచూడంగ యాపరం జోతిగనును
పట్టపగలౌను దిశలన్ని బారజూడ ॥అమర॥ (౮౧)

సీ అన్నరసముచేత నతితృప్తిజెందియు
దుర్బుద్ధిదలచకు దుఃఖజీవ
విషయముల్ దెలియక విహరించితే నీకు
జిక్కదుమోక్షంబు శీఘ్రముగను
నిద్రవేళను నాభి నిజనివాసముజేరి
నిద్రలోనను యోగనిద్రదెలసి

గీ॥ పదరకజూచితే పత్నిగర్భముననును
పట్టుదారము వేసినట్టివిధము

యటుల నున్నదో యీ మర్మమటులగాను
యన్నమార్గంబు దెలియుడీ యుపముజేత ॥అ॥ (౮౨)

సీ॥ ఆధారమైయున్న అన్నపానరసము
మణితెర మార్గమై గణుతికెక్క
ఆమణితెరజూడ నతిసూక్ష్మమైయుండు
ఆమణి తెరలోన హంసతిరుగు
మెల్లవగురిచూచి మేడ మీదికినెక్కి-
దిగువసాధన దినదినముజేసి

గీ॥ యిచ్చకొచ్చినవేళ యీ దేహమునువీడి
గురుసన్నిధికిజేరి గురుతుగాంచ
జీవునకు జావుపుట్టుక జింతలేదు
యీ రహస్యంబు దెలిసిన నరుడెరుంగు ॥అ॥ (౮౩)

సీ॥ వినుమొక్క మర్మంబు వివరింతు నికజీవ
పద్మమదళముమీద బారవద్దు
పూర్వదళము మంచి పుణ్యభూమియనుమీ
అచటనే నుండుము హానిలేదు
సంశయరహితమై సర్వమేకంబౌను
హరినామ భజనమేమరక కలుగు

గీ॥ సప్తదళములలో సంచరించినమీద
చలనంబు లేకను చెడగుణము
సప్తదళముపై నీవు సంచరింప
ముక్తియునులేదు నామాట ముఖ్యమిదియు ॥అ॥ (౮౪)

సీ॥ మొదటి దళంబున ముదితలకూటముల్
మరిరెంట కలహంబు మానదెపుడు
నరయను మూడింట నతిభక్షణము శేయు
మరినాల్గిటను నిద్రమరిగియుండు
పంచదళంబుల బాగై సవస్తువుల్
జేర్చు నారిట భక్షించుచుండు
గీ॥ వెరవక నేడింట పెరవారిధనధాన్య
ముల నాక్రమించెదా మోసపోవు
అష్టదళముల ఫలముల నరసిపోవు
తెలివిత్రోడను జీవాత్మ దెలిసికొనుము ॥అమర॥ (౮౫)
సీ॥ మృగముల వేటాడు మృగవైరి శబరుండు
తప్పక గురివేయ దగిలినట్లు
అతిధైర్యశాలవై యట్టు రాదెగజూడు
ననువులో నున్నట్టు తామసులను
పంచభూత వికార పనులకు లోగాక
పంచభూతంబులబట్టివేగ
గీ॥ ఫాలనేత్రముజూపి పరమహంసస్వామి
యునికిని గురిజూచి యుంటదెలిసి
తొల్లివచ్చిన ద్వారము వెళ్లబారి
మూలహంసంబులో జేరిముక్తి జెందు ॥అమర॥ (౮౬)
సీ॥ యీనీతి శతకంబు వీనులకింపుగా
వినినవారలను వివేకమతులు



యెన్నడు హరిభక్తి నెరుగనివాడైన
క్రూరుడైనను మహాకుటిలుడైన
ప్రాణఘాతకుడైన పరనిందితుండైన
దానధర్మములేని హీనుడైన
గీ॥ దైవదూషకుడైన తామసుడైనను
పరకాంతగూడు పాపాత్ముడైన
యెప్పుడైనను మదిని నత్యంతభక్తి
స్మరణజేసిన నతడు సద్గురునిజేరు ॥అమర॥ (౮౭)
సీ॥ హరిజగన్నాయకా అవనిజానాయకా
అఖిల లోకధార అసురవైరి
భోగపురివాస యోగీశ సర్వేశ
కౌసల్యావరపుత్ర కామజనక
నామొరాలించరా నాస్వామి నీవేరా
నిన్ను పూజింతురా నిర్మలాత్మ
గీ॥ నామనంబున నిన్ను నీమంబుతోడుత
నిన్నువర్ణింతును నీరజాక్ష
భక్తమందార సంశార భయవిదూర
నీవు దయజూడకను నెట్లు నిన్నుదలతు ॥అమర॥ (౮౮)
సీ॥ తనువులన్నిటి యందు దగిలియున్నడి నిన్ను
బుద్ధిహీనతచేత బోల్పవేరు
నీ కటాక్షమువల్ల నిన్ను నేగనుగొంటి
నీ సేవపైబుద్ధి నిలిపియుంటి

నీకథలతిభక్తి నిత్యముబలుకుచు
యోగ్యర్థమెఱిగితి యోగినింద్య
గీ॥ భయము లేదికనాకు భద్రమాయును మది
దిగులుదీరెను సదాదిక్కునీవె
బాటదెలిసెను సూటిగా భవ్యచరిత
ఫలితమాయెను నేడు నీపాదసేవ ॥అమర॥ (౮౯)
సీ॥ దేవజగన్నాథ దేవేంద్ర వందిత
దీనపోషక దేవ దేవనృహరి
దర్పకాయతరూప దశరథవరపుత్ర
దీనశరణ్య పార్థివలలామ
శరణాగతత్రాణ బిరుదాంకుడగు నిన్ను
వర్ణింప బ్రహ్మకు వశముగాదు
గీ॥ హరిరామనీవు నాయంతరంగంబున
నిలిచి నీపై బుద్ధి నిలుపవలయు
కల్లలాడను నీకటాక్షమునదగిలి
భజనజేసెదమదిలోన భక్తిగలిగి ॥అమర॥ (౯౦)
సీ॥ భవరోగవైరినీ ప్రాపుగోరుచునుంటి
పరమపావన నామపద్మనాభ
నీమీద చిత్తంబు నిలవకెపుడు మహా
మాయలో మునిగిన మానవులును
తాజూచి జూడగ దమవార లెల్లను
జచ్చుట గనియము జచ్చుటెరిగి

గీ॥ కటకటా యిటువంటి కష్టసంసారపు
జలనిధి బడిమును జనులకిపుడు
సులభమైయున్న గురుసేవ సూటిగన్న
ఘనుడు ప్రాపించు దాముక్తి కాంతనపుడు ॥అ॥ (౯౧)

సీ॥ పద్మాసనస్థుడై పట్టి వాయువుపైకి
శిలరీతిగాను సుస్థిరముజేసి
రెప్పవేయనిజూపు తప్పకనటుజూచి
గురుడు జూపిన గురి గుఱుతు దెలిసి
నిండుసమాధిని నుండి మర్మముగని
రమణతోడఁ తను తారకము జేరి
గీ॥ ముమ్మూర్తులతగరిలో ముక్తికాంతను జేరి
మురియుచు దానితో ముద్దుగొనుచు
లలితమార్గమును-నాతలంపుజేయు
నతనియోగీంద్రుడనవచ్చు నవనిలోన ॥అమర॥ (౯౨)

సీ॥ సుందరిమోము రాకేందుబోల్పగవచ్చు
పాలిండ్లు గజనిమ్మపండ్ల బోలు
అళిపత్త్రిసెనబోలు నతివకు నెరికురుల్
పణతి నాసికము సంపగిసుమము
మృగరాజ మధ్యమహాకృశమధ్యకును గాను
కదళీతరులబోలు కలికి-తొడలు
గీ॥ అలివేణిపలుకులు నమృతపుధారలు
సంపదల్ వర్షించు సఖియ జూపు

లట్టి ముద్దుల గుమ్మనానాగాంత
నెట్లునిర్మించెనో విధి నెరుగరాదు ॥అమర॥ (౯3)

సీ॥ ఆత్మ కాంతను మాని యానంద చిత్తుడై
యున్న యోగీంద్రు డీయుర్విలోన
మర్మజ్ఞుడై యుండి మాటలు మృదువుగా
పరులకు దనుజూడ బడకయుండు
ఋణము శాయడు దాను రుజుమార్గమున నుండు
కలకొద్ది భక్షించు కష్టపడడు

గీ॥ సాస్త్రముల్దదివితే సంశయరహితంబు
గాదని యోగమార్గముననుండు



తర్కవాదము మదిలోన దలపకెపుడు
నుండు స్థిరమతి నెరుగ నీయోగిమహిమ ॥అ॥ (౯౪)

సీ॥ వరకవీశ్వరులార వాదుశాయక మీరు
హరినామభజనకు హాని లేదు
అక్షరంబులకెల్ల నాధారమైయున్న
దివ్యాక్షరముజూడ దెలియవలయు
అలనారదుడు పూర్వమాత్మ యోగముచేత
నధికు డాయెను మంచి చదువునేర్చి

గీ॥ సామజవరదుని సత్యచరిత్రము
ల్బాడని వాడెమభటులపాలు
కపటమానసుడగు వాడుకవియుగాడు
ఆకవిత్వము తప్పులటంద్రు బుధులు ॥అమర॥ (౯౫)

సీ॥ చదివిచదివి జనులు జత్తురింతేకాని
జచ్చి బుట్టనివిద్య చదువలేరు
సకల శాస్త్రంబులు చదువనేర్తురు యంతె
శాస్త్రమర్మము దాముజదువలేరు
అక్షరక్షరములు నభ్యసింపుదురింతె
యేకాక్షరము మూలమెరుగలేరు
గీ॥ ఆత్మశోధకులైన హరిదాసులైనను
తప్పులెంతురు వారి జెప్పనేల
చెడ్డజనులకు మర్మంబు జెప్పరాదు
మంత్రగోప్యంబు చెడును నామాటనిజము ॥అ॥ (౯౬)
సీ॥ కనులుమూయుచు రేచకమును పూరింపుచు
కనవలె సూర్యుని కనుల నడుమ
వీనులుమూశిదా వినవలెవివరముల్
దశవిధ నౌబత్తుదప్పకుండ
జింహ్వాజాచక మూశిజీవగుణము వీడి
మంత్రము పఠియించు మట్టుదెలిసి
గీ॥ నిర్మలజ్ఞానులై నిండు వార్ధివిధము
నుండుట యోగంబు నుత్తములకు
రాగవిద్వేషములను నిరాకరించు
నతని యోగీంద్రుడనదగు నవనిలోన ॥అమర॥ (౯౭)
సీ॥ ఆపరంజ్యోతిని అఖిలాండ నాధుని
నిండు మనంబు లోనుండ జూచి
ఆత్మలోనుప్పొంగి హరినిధ్యానింపుచు

జేయనికవనము శ్రేష్టమనరు
శాస్త్రసంపుటములు చాల విచారించి
కవనము జేతురు కల్లకవులు
గీ॥ దామధికుల మంచుదర్కించి దర్కించి
వెక్కస పాటుచే విఱ్ఱవీగి
నిజము చెడకల్లలన్నియు నిజములనుచు
నాత్మ దెలియక జదువుదు రల్పకవులు ॥అ॥ (౯౩)
సీ॥ శతకంబు గూర్పగ శలవిచ్చితిరి మీరు
మీనామ ముద్దరీను మిమ్ముమదిని
నారాయణ'యను నాలుగక్షరములు
లిఖియింప శక్తి గల్గించినారు
నీయుపదేశము నెరనమ్మి మనసులో
గురిజూచి గుట్టెల్ల నెరిగినాను
గీ॥ యీ కవిత్వమునుజూచి యెవ్వరు మెచ్చరు
దయజేసి రక్షింప దాతవీవు
వంతమేటికి రక్షింపు కంతుజనక
శబరరక్షక శ్రీరామచంద్రశౌరి ॥అమర॥ (౯౯)
సీ॥ అన్నపానము నిద్రలతిసూక్ష్మమై నిల్చె
ఆచారక్రియలన్ని యణగిపోయె
వేడుకదుఃఖముల్వీడుమర గాంచెను
మరుమాయలన్నియు మాటు జెందె
సంశయచలనముల్సమశి సమశిజచ్చె
సర్వేంద్రియంబులు చల్లనాయె

గీ॥ యేమాటలాడిన నీమాట మరు
వను తెలశెనంతర్యామి దివ్యరూప
యెందెబోయెద వికనిన్ను జెంది చాల
బట్టియున్నాను నీ భక్తిఘట్టిగాను ॥అమర॥ (౧౦౦)

సీ॥ కారుణ్యగురుడు దాకరము శిరమునజేర్చి
కదలకుండంగని కనులు మూసి
లోజూపు గురిజూపి లోజేసుకుని చాల
వెరువకుమని వానివెరపుదీర్చి
అజుడు వ్రాసిన వ్రాతలట్టిదా మాపుచు
బదులు చక్కగ వ్రాసి భద్రపరచి

గీ॥ బాటచక్కగదీసి భానుచంద్రుల జూపి
మనసు సహస్రకమలముజూపి
గగనజ్యోతిని జూపిన ఘనుడు గురుడు
ఇతరగురువులతో పొందు యిలను లేదు ॥అ॥ (౧౦౧)

సీ॥ బోధించుటకు లేరు భువిలోన గురువులు
బాధించు గురువులు బహుగగలరు
సన్మనుష్యులతోటి సహవాస మెక్కువ
కుచ్ఛిత పురుషులు కోటిగలరు
ధనవంతులకు దానధర్మములెక్కువ
అనుభవించని వారలవనిగలరు

గీ॥ పూర్వసన్మము నాటిపుణ్య పాపములన్ని
అనుభవించక తీరదజునకైన

మానసంబున హరిసేవమరువకున్న
సకల పుణ్యంబులును దాను సల్పినట్లు ॥అ॥ (౧౦౨)

సీ॥ సంగీత సాహిత్య చదువులన్నియు నేర్చి
వేదముల్ గొణిగేటి వెఱ్ఱివారు
కలివిలేనివి కొన్నికంటివింటి మటంచు
పరులదగ్గర జేర్చి బలుకువారు
పలవ విద్యలు నేర్చి పాటలు బాడుచు
నతిరూపనాట్యము లాడువారు

గీ॥ మాయవిద్యలు జేసిమనుజుల నర్థించి
బ్రతుకు విద్యలనేమి ఫలముకద్దు
యన్నివిద్యలు నేర్చిన యేమిఫలము
బ్రహ్మవిద్యనెరుంగక ప్రజలు చెడిరి ॥అ॥ (౧౦౩)

సీ॥ రఘునాధవివంశ రాజరాజాగ్రణి
దయజూడరావేగ దనుజవైరి
దీనరక్షక నేను దినదినమును చాల
భక్తితో నీనామభజనజేతు
పురగేంద్రశయన నేనుడుగకనిత్యము
జేసిన పనులు నీశేవగాదె

గీ॥ దాసవత్సలనేనుధరమీాదనిడినపా
దంబులునీకు ప్రదక్షిణములు
ఆపదోద్ధారకానందహరిముకుంద
వేదవేద్యనృశింహా సర్వేశకృష్ణ ॥అమర॥ (౧౦౪)

సీ॥ శరణుశరణు నీశరణు శ్రీవేంకట
శైలనాయక నీకు శరణు శరణు
శరణు శరణు నీకు సరసిజలోచన
శరణు శరణు నీకు చక్రపాణి
శరణు శరణు నీకు చంద్రభాస్కరనేత్ర
శరణు శరణు నీకు శర్వవినుత
గీ॥ శరణు శరణు నీకు సరసిజాసననుత
శరణు శరణు నీకు జగదధీశ
శరణుజొచ్చి నవిద్వేషజనులనైన
బిలచిరక్షించు టేగొప్ప బిరుదునీకు ॥అమర॥ (౧౦౫)

సీ॥ నీమీద చిత్తంబునిలుపుట నావంతు
నీదాసులను బ్రోవనీదివంతు
దిక్కునీవనిచాల దెల్పగనావంతు
నిజదాసు నేలుట నీదెవంతు
యిలదేవతాంతరములవీడనా వంతు
నిజదాసునేలుటనీదెవంతు
గీ॥ మానసమున పూజమరుగుటనావంతు
నిజదాసునేలుటనీదెవంతు
మరణమెప్పుడో యెరుగక మానసమున
వెదకి కనుగొంటి నీకృపావిశదమహిమ ॥అ॥ (౧౦౬)

సీ॥ ఎచ్చోటనీమూతిమచ్చికగల్గిన
నచ్చోటనిన్నాత్మమెచ్చిజూతు

యెచ్చోటనైన నీమెచ్చు స్త్రీదశముల
పురుషోత్తమానిన్ను పూజసేతు
యెచ్చోటనుదకంబు లెప్పుడుజూచిన
నచ్చోట పూజలు హరికిజేతు
గీ॥ యెచ్చోట ఫలములచిచ్చగా చూచిన
నచ్చోట హరికర్పణంబుజేతు
నిన్నుమరువను క్షణమైనసీరజాక్ష
వేదవేద్యముకుంద గోవిందనృహరి ॥అమర॥ (౧౦౭)
సీ॥ పరమ పావనమైన పరతత్వపద్యముల్
లాలితభక్తి కాల త్రయమున
పఠనజేసినవారి పాలిట గురువుడా
తోడనీడై యుండు తొలగిపోడు
తనువువిడచు వేళ తలిదండ్రి ధనదార
పుత్రాది మోహముల్పుట్టనీక
గీ॥ పఠియింప పరుడుదాప్రత్యక్షమై వేగ
పదమని వైకుంఠపట్టణంబు
సన్నిధానంబుజేర్చును సద్గురుఁడు
అతిదయారసమున భక్తులవధరింప ॥అమర॥ (౧౦౮)
సీ॥ శంఖచక్రగదాసి శార్ఙ్గాయుధహస్తుడై
ప్రత్యక్షమైవచ్చె పరమగురుడు
హారుమంజిహారము లురమునమెరయంగ
ప్రత్యక్షమైవచ్చె పరమగురుడు

మస్తకస్థితి దివ్యమకుటంబుతోడను
ప్రత్యక్షమయి వచ్చెపరమగురుడు

గీ॥ నాల్గుభుజములమీదనటియించుసాలుతో
ప్రత్యక్షమైవచ్చెపరమగురుడు
పాదపద్మములందెలు ప్రస్వనింప
నద్భుతంబుగ పరుడు ప్రత్యక్షమయ్యె ॥అ॥ (౧౦౯)

సీ॥ నాపాలిదైవమై నామనంబుననిల్చి
అంచితంబుగను బల్కించినావు
పండితులెవరైన ప్రాసగణముజూచి
తప్పులున్నను నీకేతప్పువచ్చు
భేదవాదులుదీని భేధించువేళను
అగ్నిలో వేసిననణగిపోదు

గీ॥ నీకృపవల్లనునేజేయు శతకంబు
యేటిలోవేసిననెక్కివచ్చు
భక్తవత్సలశ్రీనాథ పరమపురుష
పరమపావన శ్రీరామపట్టభద్ర॥ అమరనారాయణా
చ్యుతహారిముకుంద దురితదూరకకై పరపురవిహారా

అ మ ర నా రే య ణ శ త క ము [(౧౧౦)

స ం పూ ర్ణ ము.

